సంపుటము 2] జూలై 1915 [సంచిక 1

# బాలమిత్ర



## శత్రువులకొరకు ప్రార్థించుట

ఒకనా డొక చిన్న ఇటాలియా దేశపు పిల్ల, సబ్బాతు బడిలోని పిల్లలు కొందరు తనను ఎగతాళి చేసిరని తల్లికి చెప్పెను. అప్పుడు తల్లి «అమ్మా నీ వెందుకు నీ పంతులమ్మకు వారిని గురించి చెప్పలేదు?» అని అడిగెను. అందు కా చిన్నపిల్ల

తలవంచుకొని మాట్లాడలేదు. "వారు నిన్ను ఎగతాళి చేయునప్పు డేమి చేసితివి?"

అప్పుడా బిడ్డ "యేసు తన శత్రువులకొరకు చేసినదాని జ్ఞాపకము చేసికొని వారికొరకు ప్రార్థించితిని" అనెను.

చిన్నిబిడ్డా! నీ వెప్పుడైనా ఈలాగు చేసితివా?

---

## అన్నిటియందు సబ్బాతు గలదు

ఒక ఊరిలో ఇతరుల బట్టలుకుట్టి జీవనముచేయు నొక ఆడుమనిషి గలదు. ఒక శనివారము సాయంత్రము సరికి కుట్టి అప్పగించవలసిన ఒక రవికె కుట్టుమన్నవారికి, పంపడము మరిచిపోయినది. ఆదివారముదయమున జ్ఞాపకము రాగా వెంటనే తన అప్పకూతురుని పిలిచి, ఈ రవికె పలాని మనిషి ఇంటియొద్దకు త్వరగా తీసుకొని వెళ్లుమని చెప్పినది. అందుకా పిల్ల, అమ్మా! నేడు ఆదివారముకాదా? అనగా ఆమె, పోనీ ఎవరు చూడకుండా నీ జాకెట్టు క్రిందదాచి తీసుకొని వెళ్లుమని చెప్పెను. అయితే ఆ పిల్ల యేమమ్మా! జాకెట్టుక్రిందమాత్రము ఆదివారముకాదా అని అడిగెను.

---

# పోకిరి తిమ్మన్న

ఒక అడవిలో నొక చిన్న కోతిగలదు. అది బహు పోకిరిది. అడవిలోనున్న ఒక పెద్దమఱ్ఱిచెట్టుమీద నివసించుచుండెను. దాని పేరేమో తెలియునా? పోకిరి తిమ్మన్న. ఆ యడవిలోనే, అదే చెట్టుక్రింద ఒక సింహమును దాని భార్యయు కాపుర ముండిరి. ఈ తిమ్మన్న చాల పోకిరిదని చెప్పితిని గదా! అది యీ మఱ్ఱిచెట్టు ఊడలమీదుగా దిగివచ్చి చెట్టు క్రిందకు వచ్చుచు పోవుచున్న జంతువుల తోకలను పట్టిలాగును. అవి దానిని పట్టుకొనబోవు నంతలో పైకిపారిపోవుచుండేది.





ఒకనాడది తెగించి, సింహమును దాని భార్యయు చెట్టుక్రిందుగా పోవుచుండగా వాటి రెంటి తోకలు ఒకేసారి పట్టుకొని గట్టిగా లాగెను. వాటికి పట్టలేనంత కోపమువచ్చి పండ్లు పటపట కొరికెను. దాని నేలాగునసైనను పట్టుకొనవలెనని, తమస్నేహితుడగు ఎలుగ్గొడ్డు బావదగ్గరకువెళ్లి, తిమ్మిగాడు లేనప్పుడు మఱ్ఱిచెట్టుదగ్గరకు రమ్మనిపిలిచినవి. సరే కానిమ్మని ఎలుగ్గొడ్డు వారిదగ్గరకు వెళ్లెను. అప్పుడు సింహము చెప్పినట్లుగా,

దాని తలపై నెక్కి, ఒక్క లాగుకు తెగివచ్చునట్లు ఆ ఊడలను కొరికియుంచెను.



తిమ్మని కిది తెలియలేదు. సింహము ఏమరపాటుగా అక్కడ నిలిచియుండగా మెల్లగా ఊడలను పట్టుకొని దిగి వచ్చి ముందు రెండు చేతులతో, దాని తోకను పట్టుకొని గబాలుమని లాగెను. దానిలాగుకు పుటుక్కుమని ఊడలు తెగి, సింహము కాళ్లలో తిమ్మడు పడెను.



«తిమ్మడు దొరికినాడు. రా చూతువుగాని» అని సింహము తన భార్యను పిలిచెను. అది రాగానే, తిమ్మిగాడ్ని క్రిందా మీదా పారచూచి, «ఎబ్బె! ఇది చాల సన్నగా నున్నది. ఒక వారము రోజులు, మన భోజనపు గదిలో పెట్టి, మేపి, క్రొవ్వపట్టినవెనుక, ఎలుగ్గొడ్డు బావకు భోజనం చేతాము» అని యనెను. తమ గుహవెంబడే, సింహము చిన్నగది నొక దానిని కట్టుచుండగా దానిభార్య తిమ్మనికి కావలి యుండెను. అది ముగిసినపిదప అవి దానినందులో నుంచెను. తిమ్మని కెంతమాత్రము నిది యిష్టము కాకపోయెను. కటికచీకటి, మహాచలి, గనుక ఓర్చుకొనలేకపోయెను. తిమ్మని కేమయినా పెట్టుటకు వార



కొంచెము సందుమాత్ర ముంచిరి. ప్రతిదినము అరటిపం డ్లను దెచ్చి దాని కిచ్చుచుండిరి. వాటిని తిని తిని తిమ్మనికి ప్రాణము విసుకెత్తిపోయెను. వారము దినములైన తరువాత సింహము భార్య ఎలుగ్గొడ్డుకు భోజనము చేయ రమ్మని కబు రంపెను. ఈ కబురు వినగానే వాని సంతోషమునకు మితము లేదాయెను. సంతోషముచేత చెంకలుకొట్టెను. ఎగిరి గంతులు వేసెను. ఇక్కడ సింహము తిమ్మ డెట్లున్నాడో చూడగా, ఒంటికేమియు కండబెట్టలేదు. మరీ చిక్కినట్లు కనబడెను. వానికీ సంగతి తెలిసి, ఆ అరటిపండ్లు తాను దినక ఆ గదిలోనున్న ఎలుకలకు బెట్టుచు వచ్చెను. వీడు బలియకపోవుటకు కారణమేమిటో కనుగొం



దామని అవి రెండును గోడవెంబడి నక్కి వినుచుండెను. అప్పుడు తిమ్మడు, ఎలుకలతో, "ఛీ! అబ్బా ఈ పాడు అరటిపండ్లు ఎందాక తినవలెను. కొబ్బరి కాయ ఒక్కటి దొరకకూడదూ?" అనెను.

"కొబ్బరి తింటే క్రొవ్వుబట్టుదువుగా?" అని ఎలుక లనెను.

"అవును నిజమేగాని, క్రొవ్వుబట్టితే ఆ పాడుసింహ ములు పట్టుకొనితింటవి గనుక, నా కేమి వద్దబ్బా!" అనెను.

ఇదంతయు సింహము విని, "ఓహోహో, సంగతి యిప్పుడు తెలిసినది, కొబ్బరితింటే బలుస్తుంది. సరే, యిప్పుడే తెత్తము రమ్మ"ని చెప్పుచు వెంటనే ఒక కొబ్బరిచెట్టుయొద్దకు పోయెను. కాని ఏలాగు వానికి దొరకును? చెట్లెక్కుటకు చేతగాదుకదా! అప్పుడు సింహము తన యింటికి వచ్చి, ఎలుకలను చూచి, మీ రిప్పుడే నాతోడవచ్చి కొబ్బరికాయలను కోయకపోతే మిమ్మందరిని క్షణములో మ్రింగివేయుదునని గర్జించెను. అవి గడగడ వణికి అది చెప్పినలాగే, కొబ్బరిచెట్టెక్కి కాయలు కొరికి, వాటి తలలు పగులునట్లు క్రింద పడవేసెను. ఆ కాయలు పడి రెండును చాల బాధపడెను. గాని ఎలుకలు మాత్రము క్రిందికి దిగిరాలేదు. చీకటి పడువరకు చెట్టు మీదనే యుండెను. నొప్పి కొంచెము తగ్గగానే సింహములు కొబ్బరకాయలను తీసికొని తిమ్మనియొద్దకు పోయెను. వాటిలోపల వేయుటకా చిన్న రంధ్రమును పెద్దది చేయవలసివచ్చెను. అవి అలాగు చేసి వెంటనే జాగ్రత్తగా మరల కప్పివేసెను.





కొబ్బరికాయలు దొరికినందున తిమ్మనికి సంతోషము కలిగెను. గాని బయిటిపీచు తీయుటకు చాల ప్రయాసపడెను.

పండ్లతోను, చేతులతోను, దానిని పీకి పీకి, చిట్టచివరకు దానిని



పగలగొట్టి, నీరు త్రాగి, కొబ్బరితినెను. కొబ్బరి తిని, పీచుతో ఒక అంగరాకను కుట్టుకొని వెచ్చగా పండుకొనుచుండెను. ఆ పని చేయుటలో, మితముతప్పి కొబ్బరితిని, తెలియకుండనే బాగుగా కండబెట్టెను. తన అంగరాకా వేసికొన్నప్పుడు మహా భయంకరముగా కనుబడెను.



ఇంతలో సింహాములు ఆ రంధ్రములోనుండి తొంగి చూచి కనుబడునదంతయు తిమ్మడే అనుకొని, "తిమ్మడు బాగా కొవ్వుబట్టినాడు. చాల రుచిగా నుండును, ఈ రాత్రికి తిందాము. ఎలుగుబంటిబావ వస్తే వానికి కూడా పెట్టవలెను గనుక వానికి వద్దబ్బా" అనుకొని, బాగా ఆకలి అగుటకు షికారు వెళ్లెను. పాపము, ఈ మాటలు తిమ్మని చెవినిబడెను. ఇక నెమ్మది లేకపోయెను. కోటు తీసిపారవేసి తన బొచ్చంతయు అణగునట్లు దువ్వుకొనెను. గాని ఇంకా లావుగానే యుండెను. ఆ బొచ్చంతయు నున్నబడునట్లు అరటిపండ్లను రుద్దుకొనెను. గాని లావుమాత్రము తగ్గలేదు. గనుక తిరిగి ఆ కోటువేసుకొని పండుకొని, ఏడ్చిఏడ్చి, నిద్రపోయెను.

ఇంతలో ఎలుగుగొడ్డుకు భోజనముమాట జ్ఞాపకము వచ్చి, తిమ్మడు చిక్కినాడో బలిసినాడో చూతామని ఆ సాయం

కాలము, తిమ్మడు నిద్రించునప్పుడు చప్పుడుచేయక వచ్చెను.



ఎంత బాగున్నాడో చూచి, వదలిపోలేక, సింహములు రాకముందే తిందామని ఒక్కొక్క రాతిని ఊడదీయసాగెను. ఇంతలో హఠాత్తుగా ఫెళఫెళ ధాంమని ఆ యిల్లు ఎలుగ్గొడ్డుమీద కూలబడెను. ఈ చప్పుడుకు తిమ్మడు మేల్కొని బిత్తరపోయెను. గాని తిక్క తెలిసికొని, ఇదేసందని ఎగిరి తప్పించుకొని పారిపోవుచుండెను. సింహము లప్పుడే తిరిగి వచ్చుచు,



శబ్దమువిని గబగబ పరుగెత్తుకొని వచ్చుచుండగా, తిమ్మడు గుహావాకిట కనుబడెను. అంతలో సింహము భయంకరముగా గర్జించి, ఎగిరి తిమ్మని మీదపడెనుగాని వానిగోళ్లు బొచ్చుకోటులో గుచ్చుకొన్నందున, దానినివదలి తిమ్మడు తప్పించుకొనెను. గాని దాని



భార్య హుమ్మని ఎగిరినోటితో పట్టుకొనెను. అయితే తిమ్మడు కొబ్బరికాయలను తినితిని, బంతివలె గుండ్రముగాను అరటిపండు పూసుకొని



నందునను దానినోటబడక జారి పరుగెత్తి కొబ్బరిచెట్టెక్కెను. సింహములు రెండును చెట్టు క్రిందకు వచ్చునప్పటికి తిమ్మడు చెట్టుసూపి కొబ్బరికాయలు వాటి తలలపైవేసి తలలు పగులునట్లు

కొట్టెను. గనుక పాపము, సింహమును, దాని భార్యయు, ఎలుగుబంటియు తలలు పగులగొట్టుకొని, పట్టి అరటిపండ్లుమాత్రము మొదలకుండ మ్రింగి సగమాకలితో చచ్చినట్లుండిరి.



# ప్రకృతి పాఠములు

## 12-వ పాఠము

### ఆకులు

గతపాఠములో చెట్లనోళ్లనుగూర్చి నేర్చుకొంటిమి. చెట్లు మనవలె ఆహారమును పుచ్చుకొనుట మాత్రమే గాక గాలినికూడ మనవలెనే పీల్చుకొనును. భోజనము తినుటకు నోరేవిధముగా కావలెనో అదేలాగున గాలిని పీల్చుకొనుటకు ముక్కును ఊపిరితిత్తులును అవసరమైయున్నవి. ఇవి చెట్లకుకూడ యున్నవి. నీ ఊపిరితిత్తు లెక్కడున్నవో తెలియునా? చెట్ల ఊపిరితిత్తులు చెట్ల పైభాగమందున్నవి. వాటి రంగు ఆకుపచ్చ. అవే ఆకులు. మనలో ప్రతివానికి ఊపిరితిత్తులు రెండు మాత్రమేగాని చెట్లకు అవి లెక్కలేకుండ ఉన్నవి. ఈ ఆకులు బహు చిత్రమైనవి. అవి చెట్లకు

మాత్రమేగాక మనకును, పశ్వాదులకు నెంతో ఉపయోగ కారులై యున్నవి. ఇట్టివాటినిగూర్చి తెలిసికొనుట నీకిష్టమేనా? ఈ పాఠములో ఆకులోని భాగములనుగూర్చి మాత్రము చెప్పెదను.

సాధారణముగా ప్రతియాకునందు రెండు ముఖ్యభాగములు కనబడును. వాటిలో నొకటి ఆకును కొమ్మకు జేర్చునది. దీనికే కాడయని పేరు. ఇది ఆకు అడుగుభాగమునుండి పైభాగమువరకు బోవును. పోయినకొలది సన్నగిలి చివరకు ఆకుతో కలిసిపోవును. సాధారణముగా దీనిరంగు తెలుపుగలిసిన ఆకుపచ్చవర్ణముగా నుండును. తాటియాకు, అరటియాకు మొదలైన పెద్దపెద్ద యాకులందు ఇవి పెద్దవిగానుండును.

దీనినుండి ఆకుయొక్క చివరలవరకు ఈనెలు పోవును. ఇవి కాడయొద్ద లావుగను, పోను పోను సన్నగ నగుచుండును. వీటి ముఖ్య ఉపయోగము తెలియునా? ఆకు అంతెటికి బాగుగా ఎండతగులునట్లు దానిని వెడల్పుగా తెరచి యుంచును. గొడుగుకు బెత్తములవలన నేమి ఉపయోగమో ఆకుకు ఈనెలవలన అట్టి ఉపయోగము గలదు. మరియు వీటిగుండ ఆకుకు కావలసిన రసమును ప్రవహించును.

మనకు ఆకును చూడగానే కనుపడు ఈనెలుగాక, కనుపడకుండానుండు సన్నని ఈనెలు అడ్డదిడ్డములుగా ఆకంతయు

వ్యాపించి యుండును. అవి వల నేలపై పరచిన రీతిగా నుండును. వీటి నెప్పుడైనా చూచితివా? నీటిలో చాలకాలము చీకిపోయిన రావియాకు నెన్నడు చూడలేదా? దాని నిండా చిన్న చిన్న రంధ్రములు అనేకములుండునుగదా. అవే వల యల్లికగల ఈనెలు.

వీనితో గలిసి ఈనెలచేత వెడల్పుగా తెరువబడిన భాగమునకు పత్రదళము అని పేరు. దీని అడుగుభాగమంతయు సన్నని రంధ్రములతో నిండియుండును. ఈ రంధ్రములు కంటికి కనుబడవు. ఇవే ఆకు యొక్క ముక్కులు వీటిగుండా అది గాలిని పీల్చుకొనును. మరియు వీటిగుండా అది నీటి ఆవిరిని విడుచును.



ఆకులు చెట్టుకు చాల ముఖ్యమైనవని చెప్పవలెను. మన కన్నులకు వింతగొలుపుచు, జంతువుల కనేకములకు భోజనమగుచు, చెట్లకు ఊపిరితిత్తులవలె నున్న ఆకులెంత ప్రయోజనకారులుగా నుండునట్లు దేవుడు జేసెనో చూడుడు.

---

# బైబిలు పిల్లలు

## ఏశావు

ఇసాకునకు ఏశావు యాకోబులను నిద్దరు కవలపిల్లలు గలరు. మనకందరికి ఏశావును గురించి కొంచెము తెలిసినను అతనివలన మనము అనేక సంగతులు నేర్చుకొనచున్నాము. ఏశావుయొక్క దేహమంతయు దట్టమైన వెంట్రుకలతో నిండియుండెడిది. ఇతను ఎదిగినకొలది కష్టపడి పనిజేసి తండ్రిని సంతోషపెట్టుచుండెను. గనుక తండ్రికి ఇతనియందు ఎక్కువ ప్రేమ.

ఒకనాడు పాపము! ఏశావు మిగుల పనిజేసి అధికముగా అలసి ఆకలిగొని వచ్చుచుండగా, అతని తమ్ముడు యాకోబు ఎర్ర కాడలకూర వండుకొనుట చూచి "తమ్ముడా! నాకు కొంచెము పెట్టుము" అని అడిగెను. అందులకు యాకోబు "అబ్బా! నేను పెట్టను. నీవు నాకంటె పెద్దవాడవు. నీ పెద్ద తనపు హక్కు నాకు ఇచ్చితే నీకు కొంచెము పెట్టుదును" అని ప్రత్యుత్తరమిచ్చెను. కడుపు మాడుచున్న ఏశావునకు పెద్దతనపు హక్కు నాకెందులకని సరేయని ఆక్షణమున తన జ్యేష్టత్వమును తమ్మునికి ఇచ్చివేసెను. ఏశావుయొక్క

బుద్ధిహీనత జూచితిరా? కొంచెము సేపు ఆకలిని ఓర్చుకొనలేక తనకు గల గొప్ప దానమును అమ్ముకొనియె. అతడు కష్టములకు ఓర్చుకొనువాడు కాడు. మనము అట్లుగాక మనకు వచ్చు కష్టములను ఓపికతో ఓర్చుకొనుచుండవలెనని పై సంగతి మనకు హెచ్చరిక నిచ్చుచున్నది.

ఏశావునకు వేటయందు మిగుల ఆశ. వేటాడి, తెచ్చిన వేటను రుచిగా వండి తండ్రి తిని తృప్తిపొందునట్లు చూచువాడు. తన్ను ప్రేమించుకొని కన్న తండ్రిని ప్రేమించని దుష్టబాలుడు కాడు. తండ్రి వృద్ధాప్యమునకు వచ్చుచుండగా, అతనిని మరి యెక్కువగా ప్రేమించుచుండువాడు. ప్రియ బాలమిత్రులారా మీ తల్లిదండ్రులను ఏశావువలె ప్రేమించుచున్నారా? లేక వారు మిమ్ముల ప్రేమించుచున్నను, మీరు వారిని ప్రేమించక దుఃఖపెట్టుచున్నారా? తల్లిదండ్రుల సుఖపెట్టి ప్రేమింపని బాలురకు లేక బాలికలకు దైవ ఆశీర్వాదము ఉండదు. దిన క్రమేణ మన తల్లిదండ్రులు మనపై గల ప్రేమ విడుతురు.

ఏశావు తండ్రిని ప్రేమించుటబట్టియే ఆతని నాశీర్వదించ గోరెను. ఇది ఆతని తల్లి విని మోసముగా తన చిన్న కొమరుడగు యాకోబును తండ్రి యొద్దకు పంపి అన్ని ఆశీర్వాదములు అతడే పొందునట్లు చేసెను. మనకు రానై

యున్న మేళ్లను ఇతరులు మోసముగా తీసుకొన్న మన కందరికే అధిక కోపము వచ్చునుగదా? అట్లే ఏశావునకు తన్ను రెండవమారు ఇట్లు మోసపుచ్చిన యాకోబుపై మిగుల కోపమువచ్చి అతని చంపజూచెను. మనము మన సహోదరుల చంపరాదు. ‹‹నరహత్య చేయవలదు›› అను ఆజ్ఞ జ్ఞాపకము చేసుకొని సరిగా నడువవలెను.

యాకోబు పారిపోయి, చాలా సంవత్సరములు తన మేన మామ యింటనుండి తిరిగి వచ్చినపుడు ఏశావు అతని ప్రేమతో ఎదుర్కొని ముందుగల కోపమంతయు మరచెను. ఇట్లే, మనమును ఇతరులు మనకు కీడుచేసినను, వారి కీడులకు బదులు మేలులు జేసి మేలువలన కీడును జయింతముగాక!

---

# బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రులారా!

మేము రెవరెండు తామసు దొరగారి క్రిందనున్న నరస రావుపేట మిషన్ బోర్డింగులో యున్న హిందూ పిల్లలమై యున్నాము. మా సంగతులగురించి మీకు తెలుపు




టకు చాలా ఇష్టపడుచున్నాము. మేము ఇదివరకు మా గ్రామపు బజారులందు తిరుగుచు, కాలము వృధాచేయుచు, వినరానిమాటల వినుచు, ఆడరాని భూతుమాటలను ఆడుచుంటిమి. తామసు దొరగారు ప్రేమతో మమ్ము బోర్డింగు బడియందు చేర్చి విద్యనేర్పించుచు, దైవభక్తిని గురించి మాకు దెలుపుచున్నారు. మా బోర్డింగు పంతులుగారు పూర్వము హిందువుడైనను రక్షణమార్గము నవలంబించి యున్నందున మమ్ముల మిగుల ప్రేమించుచు, కాలము వృధాపుచ్చకుండు నటుల చూచుచున్నారు. పూర్వము అన్యులముగాన దై-

ప్రార్థనలంటే తెలియకుంటిమి. ఇప్పుడు మేము ప్రార్థన బాగుగా చేయగలము. మంచి పాటల పాడగలము. ఇది యంతయు దేవుని శక్తియే. మేము త్వరలో బాప్తిస్మము పొందనైయున్నాము. మా దొరగారు మాకు బాలమిత్ర పుస్తకముల తెప్పించి యిచ్చుచున్నారు.

ప్రియ బాలమిత్రులారా! మమ్మును గురించియు ఇంకా వినుకొండ తాలూకాయందును, ఇతర తాలూకాలయందును క్రీస్తుసువార్త వినని వారిని గురించియు ప్రార్థించండి. మాబడి ఇంకా వృద్ధిపొందునట్లు ప్రార్థించండి. బాలమిత్ర సంపాదకురాలికి మా వందనములు. మీకు మా సలాములు.

ఇట్లు

మీ బాలమిత్ర

బవనం. సీతారామరెడ్డి

నరసరావుపేట

C. L. S. PRESS, MADRAS—1915